# హరి అంతరిక్ష యాత్ర

జాన్సన్





మధ్య రాత్రిలో హరి లేచాడు. వస్తువులు

కనపడేలా ఆకాశంలో చంద్రుడు ఉండేలా చూసి

మంచి నీళ్లు తాగటానికి వెళ్లాడు.



చీకటిలో మనుషులు చూసేవాటి గురించి హరి ఆలోచించాడు. అవి ఎక్కడి నుంచి వస్తాయోనని ఆశ్చర్యపోయాడు. వెన్నెలలో అవి తనకు కనపడనందుకు అతడు సంతోషించాడు.



వెన్నెలలో ఏమీ కనిపించటం లేదని ఉన్నట్టుండి అతడు గుర్తించాడు. చూడటానికి అక్కడ ఏమీ లేదని హరికి అర్థమయ్యింది. అతడు ఒక ఎడారి మధ్యలో ఉన్నాడు.



అంతగా దాహం వెయ్యటం అతడికి

వింతగా అనిపించలేదు. అయితే అతడి

వెంట వంగ వన్నె క్రేయాను ఉంది.



ఎడారిలో నీళ్లు ఎక్కడ

ఉంటాయో తెలుసు అతడికి.



ఖర్జూర చెట్టు దగ్గర నీళ్లు

ఎప్పుడూ ఉంటాయి.



హరి తనివి తీరా నీళ్లు తాగాడు. ఎడారిలో

చల్లటి నీళ్ల కంటే కావలసింది ఏముంటుంది.



నాలుగు వైపులా చూసిన హరికి, ఇసకలో

ఆడుకోవటం తప్పించి, ఎడారిలో చెయ్యటానికి

పెద్దగా ఏమీ లేదని అనిపించింది.



అప్పుడు అతడికి ఎడారిలో నుంచి ప్రభుత్వం

రాకెట్లు ప్రయోగిస్తుందని గుర్తుకు వచ్చింది.



చంద్రుడి దగ్గరకు వెళ్లాలని

హరి నిర్ణయించుకున్నాడు.



వేగంగా వెళ్లే రాకెట్టు అయితే చంద్రుడి దగ్గరకు

వెళ్లి మరునాడు ఉదయం నాస్తాకి తిరిగి ఇంటికి

చేరుకోవచ్చని అతడు అనుకున్నాడు.



రాకెట్టుకి నిప్పు రాజేసాడు.



ఆకాశంలో వేగంగా ప్రయాణించసాగాడు.





కానీ రాకెట్టు చంద్రుడి మీదకు వెళ్లలేదు.

దానికి ఒక మైలు దూరం నుంచి

ఆకాశంలో ఇంకా, ఇంకా పైకి పోతోంది.



పైకి, ఇంకా పైకి కారు చీకటిలోకి

అతడు ప్రయాణించసాగాడు.



చుక్కలను బట్టి తాను ఎక్కడున్నాడో తెలుసుకోటానికి హరి ప్రయత్నించాడు. గ్రహాలు, తోకచుక్కల బట్టి కూడా తెలుసుకోటానికి ప్రయత్నించాడు.



అయితే, వెలుతురు ప్రసరించే మరొక చంద్రుడి అవసరం అతడికి ఉంది.



కానీ, కొంచెం దగ్గరగా చూసిన హరికి

చంద్రుడు కనపడలేదు. ఎగిరే పళ్లెం

కనపడేసరికి అతడు ఆశ్చర్యపోయాడు.



ఎగిరే పళ్లాల గురించి హరి విని ఉన్నాడు.

చీకటిలో ప్రజలు వాటిని చూశారు. అయితే,

వాటి లోపల ఎవరు ఉంటారో, వాటిని ఎవరు

నడుపుతారో ఎవరికీ తెలియదు.



వెంటనే తన రాకెట్టుని దించటం

మంచిదని అనుకున్నాడతడు.



ఒక్క కుదుపుతో రాకెట్టు ఒక వింత

గ్రహానికి కిందవైపు దిగింది.







అంత పెద్ద గ్రహం మీద నుంచి హరి

కిందకి పడిపోయే ప్రమాదం లేదు.

అయినా కానీ, గ్రహానికి పై వైపున ఉంటే

బాగుంటుందని హరికి అనిపించింది.



ఏ గ్రహం మీద దిగానా అని
అతడు ఊహించసాగాడు.

తారల వెలుగులో తనకి ఆ విషయం తెలియ
చేసే సంకేతాల కోసం హరి చూశాడు.




అతడు అంగారక (మార్స్)
గ్రహం మీద ఉన్నాడు.

అంగారక గ్రహం మీద జీవం ఉండొచ్చన్న
విషయం హరి విని ఉన్నాడు. ఎవరికైనా
వినపడుతుందన్న ఆశతో అతడు పెద్దగా,
“హలో," అంటూ అరిచాడు.


అతడు ఎగిరే పళ్లాల గురించి ఆలోచించాడు.
చీకటిలో మనుషులు ఊహించుకునే వాటి
గురించి కూడా ఆలోచించాడు. ఎవరైనా తోడు
ఉంటే బాగుండునని అతడికి అనిపించసాగింది.
అంగారకుడు పైన మనిషి అనేవాడు ఉంటే అంత
దూరం నుంచి అతనితో మాట్లాడటానికి వచ్చిన
తనతో స్నేహంగానే ఉంటాడని హరి అనుకున్నాడు.


అంగారకుడు మీద ఉండే మనిషి ఎలా
ఉంటాడనేది అతనికి తెలిసిన అరకొర
విషయాల ఆధారంగా గీయసాగాడు హరి.
చీకటిలో ఎటూ సరిగా కనిపించదు కాబట్టి
అంగారకుడు మీది మనిషి ఎలా ఉంటాడనేది
హరి పెద్దగా పట్టించుకోలేదు.



చీకటిలో స్పష్టంగా కనిపించకపోయినా

దగ్గరలో స్నేహపూర్వక మనిషి ఉంటే

చాలని హరి అనుకున్నాడు.

అంతలోనే హరికి స్పష్టంగా

ఒక రూపం కనపడింది.



చీకటిలో మనుషులకు కనిపించే రూపం అది.

అది ఒక ఎగిరే పళ్లెం మీద కూర్చుని ఉంది.

హరి అక్కడినుంచి వెంటనే పరిగెత్తాడు.



అంతలో అతడికి ఒక ఆలోచన వచ్చి ఆగిపోయాడు.

బహుశా అది ఎవరైనా ఒక చిన్న పిల్లవాడిని

భయపెట్టటానికి భూమి వైపు వెళుతోందేమో?



దాంతో హరి ధైర్యాన్ని కూడగట్టుకుని

మెల్లగా వెనక్కి వెళ్లాడు.



తాను వచ్చిన సంగతి తెలియకుండా

ఉండటానికి అతడు మునివేళ్ల మీద

అక్కడికి వెళ్లాడు. తరవాత తన వంగరంగు

క్రేయాన్ తీసుకున్నాడు.



దాంతో ఎగిరే పళ్లెంలో పెద్ద

పగులు ఏర్పడేలా చేశాడు.



ఆ రూపం తనని పట్టుకునే లోపు విజయ దరహాసంతో అక్కడినుంచి పరిగెత్తాడు.

చీకటిలో చేతనైనంత వేగంగా అతడు పరిగెత్తాడు.



దారి ఏటవాలుగా ఉండటం
సంతోషించదగ్గ విషయం.

పల్టీకొట్టి పడిపోకుండా ఉంటే
చాలని హరి అనుకున్నాడు.



అతడు తలకిందులుగా తన రాకెట్టు ఉన్న
అంగారకుడి కింది వైపుకి క్షేమంగా వచ్చాడు.

అయితే, ఇప్పటికి చేసిన సాహసాలు చాలని హరి
అనుకున్నాడు. ఆధార పడదగిన విధంగా అతడు
భూమిని చేరుకోవాలని అనుకున్నాడు.



అందుకే అతడు ఒక నక్షత్రం మీదకి దిగాడు.



అది సరిగానే తీసుకుని వెళుతోంది, కానీ

చాలా నెమ్మదిగా వెళుతోంది. నక్షత్రంలోని

కోసు భాగం అతడి కాలికి గుచ్చుకుంటోంది.



నేలకి రాలే ఉల్క మీదకి చేరుకోవాలని కోరుకోవటం

అన్నిటి కంటే మంచిదని అనుకున్నాడు హరి.



అలా కోరుకోటానికి బదులు, నేలకి

రాలుతున్న ఒక పెద్ద నక్షత్రం మీదకి

ఆ మరుక్షణం దూకాడు.



తరవాత హరి ఎటువంటి కుదుపులు

లేకుండా నేరుగా భూమి మీద దిగాడు.



దారిలో అతడికి చంద్రుడు కనపడలేదు. చంద్రుడికి

ఏమయ్యిందని అతడు అనుకున్నాడు. ఆకాశంలో

ఎక్కడా చంద్రుడు కనపడటం లేదు.



రేయి గడిచి, సూర్యుడు ఉదయించే

సమయం అవుతోందని అతడు

గ్రహించాడు. హరికి చాలా ఆకలిగా ఉంది.



సరైన సమయానికి

సూర్యుడు ఉదయించాడు.





సూర్యుడు పెద్దగా, ప్రకాశవంతంగా

ఉన్నాడు. ఆ రోజు బాగుంటుందని

హరి అనుకున్నాడు.

ఎగిరే పళ్లాల గురించి, వాటిలో   రూపాల

గురించి చక్కని సూర్యకాంతిలో ఆందోళన

పడవలసిన అవసరం ఉండదు.



ఒక్క క్షణం పాటు అతడు ఆశ్చర్యానికి
లోనయ్యాడు. ఎగిరే పళ్లెం ఒక దానిని చూశానని
అతడు అనుకున్నాడు. అది దూరంగా క్షితిజం దగ్గర
ఉంది. అది అప్పుడే కిందకి దిగినట్టు ఉంది.



కానీ, హరి పొరపాటు
పడ్డాడు. అది ఎగిరే పళ్లెం
కాదు, అతడి నాస్తా గిన్నె.



వేడి వేడి నాస్తా అంటే హరికి చాలా ఇష్టం.



అతడు తన కుర్చీ వేసుకున్నాడు.



నాస్తా చెయ్యటానికి హరి కూర్చున్నాడు.

అయిపోయింది